సం॥ర చందా రు 1-0-0 (పోస్టేజితోసహా) Reg. No. M. 3766

సంపుటము 32 సంచిక 2

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# Andhra Rastra Prarambha Vidya

(విద్యావిషయిక మాసపత్రిక)

మే 1943

సంపాదకులు:

శ్రీయుత మహావాది వేంకటరత్నముగారు, బి.ఏ.,



వ్యవస్థాపకులు:

శ్రీయుత ఈదర వేంకయ్యగారు,

ప్రొప్రయిటరు:

రామా అండ్ కో.,

హెడ్ ఆఫీసు :— ఏలూరు,

బ్రాంచెస్:— గుంటూరు - రాజమండ్రి.

Printed by Mr. Edara Venkaiah at his Pattabhirama Press, Ellore.

# విషయసూచిక

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

**ANDHRA RASTRA PRARAMBHA VIDYA**

విద్యావిషయిక మాసపత్రిక

| సంపుటము 32 | ఏలూరు 15 మే | సంచిక 2 |
|---|---|---|



## నిత్యసంకీర్తనము

**వివరణము :**

సత్యమెన్నడును నశింపదు. సత్యాన్వేషణమందలి ప్రయత్నమెన్నడును వ్యర్థముగాదు. మనకు తాలిమియు, పట్టుదలయు, దైవమునందు అచంచలమగు విశ్వాసమును, ఆవశ్యకములు. ఇంతకన్న మరేమి కావలయును ? జీవితము కొఱకే అనగా విశాలభావములు, విశాలదృష్టి కొఱకు మాత్రమే జీవింపదగును ఇతరుల మెప్పునకుమాత్ర మెన్నడును ప్రయత్నింపరాదు. సత్యారాధన మనలో దృఢసత్వమును, విశ్వాసమును, బుట్టించును.

**సంకీర్తనము:**

1. హే జ్యోతి స్వరూపా ! నిత్యమూర్తీ ! నాహృదయమున నీ సత్య జ్యోతి వెలుంగనిమ్ము.
2. నా హృదయమున నీచభావములకుం దావొసంగకుము.
3. భక్తివిశ్వాసములతో సదా నిన్నారాధింతును గాక ! నీ యనుగ్రహ పాత్రుడ నగుదును గాక !!

—స్వామి రామతీర్థ

# ఈశ్వరస్తుతి

చిలకా వేంకటకృష్ణదాసు

క. శ్రీ పర్వతీకళత్రా । పాపలతా శితలవిత్ర పరమపవిత్రా!
తాపస వినుత చరిత్రా ! । నీపాదాబ్జ మధుపముగ నెఱివసియింతున్.
క. తరుణాభామృత కిరణా । భరణా ! త్రిదశారిహరణ ! భవసంతరణా
సురముని సేవిత చరణా ! । గిరిశరణా ! నన్నుబ్రోవు గిరిజారమణా !
క. బోధకుడ వీవు నేనొక । బోధితుఁడను నిన్ను జేరి మ్రొక్కుచు నుంటిన్
బోధస్వరూప ! తత్త్వము । బోధించి కృతార్థుఁ జేయు ముత్తిద ! శంభూ.

---

# ప్రార్థనగీతము

రచయిత:—నుసర్ల విశ్వనాథం, టీచర్ కడప

[చెల్-చెల్-ర-నౌ జవాన్ అనుమాదిరి]

శ్రీదేవ బ్రోవుమా ॥శ్రీ॥
పాఠశాల బాలురము దేవబ్రోవుమా ॥శ్రీ॥
తామరసాక్షా - కరుణాకటాక్షు
నీదుపదంబుల్ మది తలతుమోహరి
ఆడెదము - పాడెదము ఆత్మశాంతికి ॥శ్రీ॥
మా ప్రార్థనమునూ - నీదుమదిలో
మరువకుండు మా - నిన్నునమ్మితి
విద్యనొసగి మమ్ములనూ - వేగబ్రోవుమా ॥శ్రీ॥

---

## ఐదంకెలు, పిల్లలకు పాటమూలకముగ నేర్పుట

ఒకటి, ఒకటి – ఒప్పులకుప్ప
రెండూ, రెండూ - రెక్కలపీట
మూడూ, మూడూ - ముక్కాలిపీట
నాల్గూ, నాల్గూ, – నా ఆవుకాళ్లు
అయిదూ, అయిదూ - అరచేతివ్రేళ్లు.

---

# ఆశీస్సు

(కవికుమార దాస్యం అప్పారావు)

సీ॥ ఆంధ్రదేశాభ్యుదయ ప్రదాంశములతో, రాష్ట్రమందెప్పుడు గ్రాలుమమ్మ!
ప్రాధాన్యభావ సంభరిత పద్యవ్యాస, రంజితంబయి చాల ప్రబలుమమ్మ!
భవ్యాంధ్ర సంస్కృత భాషా ప్రబోధక, విద్యాప్రదాయివై వెలయుమమ్మ!
ప్రబలకళాబోధ పద్ధతుల్ మితిమీఱి, వృద్ధియౌరీతి వర్ధిల్లుమమ్మ!
గీ॥ గానసాహిత్య విద్యాది కళలతోడ, బుధవినుత వరమాతృ ప్రబోధతోడ
తగ నుపాధ్యాయులకుఁ గల్పతరువ వగుచు, మీరెదవుగాత మారవితారకముగ!

బోధకా!

చ॥ చిఱుత వయస్కులం గని విశేషమృదూక్తులఁ బెక్కుభంగులన్
బరిపరిబుజ్జగించుచును బాటలనాటల నోలిబోధనల్
గఱపుముగాని నాకు నధికారము గల్గెనటంచుఁ గ్రొవ్వియుం
దఱిఁ గడగండ్లఁ బెట్టకుమ నాశము మోనము పేదబోధకా!

---

# 8 వ తరగతి - భాషారచన

వెల్లంకి లక్ష్మావధాని - దాచేపల్లి

## కొన్ని యనుభవములు - సూచనలు

మాతృభాషారచనలో నెనిమిదవ తరగతి విద్యార్థులకుఁగల లోపములను సవరించుమార్గములఁ గొన్నిఁటిని గతసంవత్సరఁపు ఇ. యస్. యల్. సి. పబ్లిక్ పరీక్షా నివేదిక సూచించుచున్నది. బోధనానుభవదృష్టితోఁ గొన్ని యంశములిచ్చుట విచారింతము.

1. భాషావిభజన:— మన భాషలో గాంధికము, వ్యావహారికమను గొప్ప విభజన లేర్పడినవి. ఇదియే విద్యార్థుల రచనాసౌష్టవమును గుంటుపడఁ జేయుటలో నగ్రతాంబూలమందినది. పాఠశాలా ప్రవేశమందుటకుఁ బూర్వము విద్యార్థి గ్రాంధికమువిని యెఱుంగడు. పిమ్మటఁగూడ దినమున కైదు గంటలవంతున సంవత్సరమునకు, రెండువందల యిరువది దినములు మాత్రమే గ్రాంధిక భాష వినుటకును, భాషింప నభ్యసించుటకు, నవకాశము కలుగు [illegible] దు లేఁబ్రాయమును, గోలఁది యనుభవమును, దోడగుచున్నవి. కావున గ్రంథస్థవిషయములు గ్రహింపశక్తి గల్గియు నభిప్రాయప్రకటన

మందును, రచనాసమయమునందును, నిర్దుష్టత స్ఫురింపకున్నది. ఉద్దండులగు పండితులుగూడ ననర్గళ గ్రాంథిక సంభాషణము నలవరించుకొనఁ గల్గిరా ?

కావునఁ బరీక్షాధికారులు రచనా నియమములను గొంతవరకౌదార్యముతో సడలించుటలెస్స.

2 పత్రికల సేవ:— ముఖ్యముగా విద్యావిషయిక పత్రికలు వ్యావహారికము విసర్జించి, గ్రాంథికము నుపయోగింపవలెను. ముఖ్యముగా శీర్షికలు పెద్దయక్షరములతో నుండి పాఠకులనాకర్షించును గావున నిర్దుష్ట ప్రయోగములు ధరించి యుండవలెను. ఇది విద్యార్థులకు భాష బోధింపవలసిన యుపాధ్యాయులకుఁ, గొంత పరిశ్రమ నిచ్చును. మరియు విద్యార్థుల నాకర్షించు విధమున గ్రాంథికరచన గల కొన్నిపుటలను బ్రత్యేకించిన పత్రికలు మహోపకారముఁ జేసినవగును.

3. భక్తిశ్రద్ధాదులు:— విద్యార్థులకే కాక తత్పోషకులకుఁగూ విద్యపై భక్తియు, శ్రద్ధయు, నుండవలయును. పుస్తకములు, గాగితములు, మొదలగునవి కొనుటయందశ్రద్ధ చేయరాదు. పేద విద్యార్థుల కిట్టి సహాయ్యమును దమకువచ్చు స్వల్ప వేతనములనుండియేఁ గావించుచుండఁగా శక్తియుతులునుగూడ నట్టిసహాయ్యమర్థించుట నీచము. గతసంవత్సర పరీక్షానివేదిక తెలసిన సలహాల నాచరించుటకు [illegible] కాగితములులేవని యాందోళనము చేయుచున్నారు. వీరికిఁ బ్రభుత్వము సహాయ మొనర్పవలయును. విద్యార్థులను దినము బడికి వచ్చునట్లేర్పర్చినది మరల నింట మననము చేయించుచుండవలెను :

4. బోధకుల కార్యోత్సాహము:— భాషనేగాక, తక్కిన విషయముల బోధించు పట్లఁగూడ నొకటవ తరగతి నుండియు విద్యార్థులకు గ్రాంథిక భాష నలవడఁజేయుటలో బోధకుల ప్రమత్తత వహింపవలెను ఉత్సాహవంతులును, కార్యదీక్షాపరులునై తమ్ముతముందుఁ బరిశీలించి కొని, బోధితులకు మార్గదర్శకులు గావలెను. తొలినుండియు గ్రాంథిక భాషా ప్రబోధమబ్బినఁగాని తుదికి విద్యార్థులు గమ్యస్థానము నందలేరు.

5. భాషాబోధకులవిద్యా యోగ్యతలు :— ఈ భాషారచనలోని లోపములను సవరించుటకుఁ గల సాధనములలోఁ బండితులనియమించు టొకటి యని పరీక్షానివేదిక తెలుపుచున్నది.

గత సంవత్సరఁపు భాషా పత్రమును, బరిశీలించినచోఁ బదిమార్కులునిర్ణయింపబడిన VIIIB సంధులు విడదీయు ప్రశ్నమును, III వ ప్రశ్నలోని యలంకార భాగము మాత్రమే పండితుల సహాయ్యమపేక్షించునవి యగును.

నూతన మాతృభాషా ప్రణాళిక యాంగ్ల భాషా సాంప్రదాయము ననుకరించుచున్నది. సెకండరీగ్రేడు ఉపాధ్యాయులు స్కూలుపైనలు తరగతివరకు మాతృభాషను వ్యాకరణాంశములతో గూడ దిట్టముగా నేర్చియుందురు. అర్థములు, భావవివరణము, విరామచిహ్నములు, పేరావిభజనతోఁ గూడిన వ్యాసరచన, ప్రశ్నలకుసరియగు ప్రత్యుత్తరములు, బోధించుటకు సెకండరీగ్రేడువారే సమర్థులు; మరియు గతసంవత్సర నిర్ణీత పాఠ్యపుస్తకములోని కొలంబస్, 'విశ్వ

నాథనాయకుడు' వంటిపాఠములు పండితులకు దుర్గమములు. చారిత్రకజ్ఞానమును, భూగోళశాస్త్ర సూత్రములు, నేర్చిన వారికే యవిసాధ్యములు.

ఈలోటుబాపుకొనుటకే పండిత పరిషత్తిటీవల యిట్టివిషయములందుఁ బరీక్ష లేర్పరచినది కావున నాంధ్రాంగ్లముల యందును, బ్రాపంచకవిషయములను దెలుపు నవీన శాస్త్రములందును, కృషి చేసినవారు భాషాబోధనము నాక్రమింప నర్హులు.

---

# బుద్ధ జననము

## కె. ఎ. స్వామి

(హిమాలయ పర్వతప్రాంతము. లుంబినీవనము, వివిధరకముల చెట్లతో నిండి ఉంది. పలుచని కమ్మతెమ్మెరలు వీచుచున్నవి ముందుగా మాయాదేవి వెనువెంట పరిచారిక మరీచి వనదృశ్యములను చూస్తూ పచారుచేస్తూ ఉంటారు. కపిలవస్తు మహారాణి మాయాదేవి ఆనందంగా సంతోషంగా ఉంటుంది.)

మాయాదేవి:—అయ్యో...

మరీ:— ......

మాయ:—మరీచీ

మరీ:—ఏమమ్మా !

మాయ:—అటు వేపు చూడు మరీచీ, సూర్యుడు లేత మబ్బుల్లో యేలా దాక్కుంటున్నాడో ?

మరీ:—ఔనమ్మా !

మాయ: —అబ్బా...అబ్బా.....దైవ సృష్టి-ఎంత తేజం. ఎంతకాంతి స్వయం ప్రకాశం.

మరీ:—ఏమమ్మా ! ఆయాసంగా వుందా?

మాయ:—లేదు, లేదు - నీవు పొందరాదూ ! చూస్తున్నావా ఎంత ఆనందముందో సృష్టిలో ? సృష్టి కర్మాగారములో నీవు, నేను, చెట్లు, చేమలు, రాళ్లు, కొండలు, సముద్రములు, కాననములు, గ్రహములు, తయారయిన వస్తువులు దైవసృష్టిలో చెడుగులేదు. సర్వము మంచియే. ఆ కళామధువు నారాధించు. కళ నుపాసించు నీ జన్మ సార్థకమౌతుంది.

మరీ:—మహారాజ్ఞిగారు పరాకుగా నున్నట్లున్నది. కాంతి ఏది? కళామధు వేమిటి? అమ్మా ! నాకేమి అర్థము కాలేదు మీ మాటలు ?

మాయ:—చూడు చెలీ! ఈదినం ఉద్యానవనం నూతన కాంతులతో ప్రకాశించుచున్నది కదా ! ఆ విరజాజులు పుష్పించినట్లున్నవి. ఈలుంబితకు సుమగుచ్ఛం తేనెసోనల నీనుచున్నది. ఈ సస్యములు శ్యామలమై రమణీయమై యొప్పుచున్నవి. చెలీ ! సంధ్యా సమయము ఆహ్లాదకరముగా లేదు. హాయి ! హాయి!... కళామధువు కళారసమెంత మధురమైనది ?

మరీ:—ఉద్యానవనములో విహరించుటచే కలిగిన బడలికచే గాబోలు నిలాఅంటున్నారు ?

మాయ:—లేదు - లేదు. చెలీ! నాకేమీ ఆయాసములేదు. నవరసమయ ప్రకృతి

రంగమును తిలకించేవారి ఆనందాశ్చర్యములకు మేర ఉందా...? వారి కాయాసముండనే ఉండదు.

మరీ:—మహారాణీ! నిండుచూలాలు వగు తమకు యిట్టి వేదనలు కలుగుట సహజము. కొంచెము సేపు ఈ లంబిత వృక్షచ్ఛాయను విశ్రమించి సేద తీర్చుకొనిన బాగుగా నుండును.

మాయ:—ఆ మాటలను విననట్లు లేదు. చిత్ర విచిత్ర వర్ణాలంకృతమగు శకుంత సంతానముల వీక్షించి మొదటిధోరణిలోనే) చెలీ! చెలీ! యిది యేమి ఆశ్చర్యము? కాకములు, కోకిలలు, పరస్పర వైషమ్యములు మాని పాసలుచున్నవి. నేడేమి పుణ్యదినము?

మరీ:—(తనలో) ఈ సుభూతు పుత్రికకు పుట్టింటికేగు కోరిక ఏల జనించెను? జనించెనే యనుకొందము. మహారాజందుల కెందు కంగీకరింపవలయును? పుట్టింటికేగువారలెందుల కిచ్చటనే బసచేయవలయును! అయ్యయ్యో! ఏదోవన దేవత యావేశించినట్లున్నది! (ఏమి చేయుదును) (ప్రకాశముగా అమ్మా! దేవర వారికి కబురంపవలెనా?

మాయ:—(మొదటి ధోరణిలోనే) వన వికసితములగు జాజి, మల్లిక, శిరీష పుష్ప సుగంధ మందసమీరుడిదిగో! మధుర సంగీతధ్వాన వీణాఝుంకారము లొనర్చు శుకపికారావము లవిగో? నేడుగదా అలనాటికలలోని ప్రకృతి సౌందర్యమును చూడగలిగితిని. నా జన్మ ధన్యమైనది. నేను ధన్యను. మరీచీ! నేటి యమృత ప్రకృతిని కవి వ్రాయగలఁడా...? శిల్పి చిత్రించగలడా...? వ్రాయలేడు చిత్రించలేడు.

మరీ:—అమ్మా! దేవరవారికి కబురంపితిని. ఇంచుక సేపు విశ్రమింపుడు.

మాయ:—(లంబిత వృక్ష దిగువనున్న పాలరాతి సోఫాపై పడుకొని దీర్ఘముగా ఊపిరిని విడుస్తూ ఆయాసపడుతూంటుంది). చెలీ! చిన్న పాట పాడు. వింటూ నిద్రపోతాను.

మరీ:—

ఎంత కష్టము తల్లి యెంత కష్టమ్మొ
నాయమ్మ నీకు నెంతటి కష్టమొదవె.
పుట్ట బుట్టినయట్టి దిట్టముల్ నుడువు
పుట్ట తేనియతీపు బుట్టుకబ్బమ్మ
గడు భక్తి నీకిచ్చి గణుతిగన్నట్టి
కవులగన్నపుడింత కష్టమ్మె లేదు॥ ఎంత॥

* * *

(మాయాదేవి పాట వింటూ చిన్న మగ శిశువును ప్రసవిస్తుంది. తెరలో మరీచీ! మరీచీ! అని గొంతు వినపడుతుంది.)

మరీ:—(మహారాజున కెదురేగి) మహాప్రభూ! (నమస్కారము చేయును.)

శుద్ధో:—మరీచీ! రాణి ఏమిచేయుచున్నది?

మరీ:—ప్రకృతి, కళ, కాంతి, అంటూ పిచ్చిమాటలాడుచున్నది ప్రభూ!

శుద్ధో:—మరీచీ! కళా కాంతులనునవా పిచ్చిమాటలు? వెర్రిపిల్ల!

మరీ:-నిజమే-ప్రభూ! ఇంకనూ యేవియో మతిలేని మాటలాడుచు యిప్పుడే మానిరి. ఏదియో వనదేవత ఆవేశించినది యనుకొంటిని గాని ప్రసవవేదన యని భావించలేదు. చిన్న మగశిశువు జనించినాడు. దివ్య పురుషుఁడు ఉదయించినాడు.

(ఇద్దరులోన ప్రవేశింతురు).

శుద్ధో:—(లంబినీ వనమున ప్రవేశించిన

దివ్యపురుషుని మోహనోదయ సమయమున గల రమణీయ ప్రకృతిని వీక్షించి ముగ్ధుడై దేవీ! దేవీ ప్రకృతి యెంత మనోహరము, ఆహ్లాదకరము, శుభదాయకములై యున్నది. ఆహా! కోటి సూర్యప్రబల బరిహసించు నీ వెలుంగేమి? (శిశువు నెత్తి ముద్దిడి) దేవీ! నేటికి మన పూజలు పండినవి. మన నోములు ఫలించినవి.

మయ:—అది యంతయు దేవదేవుని యనుగ్రహము. మన అభీష్టములు ఫలించినవి. నేటికి మనము ధన్యులము.

శు:—మన సర్వార్థములు సిద్ధించినవిగాన యీతడే మన సిద్ధార్థుడు! ఆముదముడిగిపోయిన దీపికలో ఘృతమును పోసిన సిద్ధార్థుడు! నిరాశాపూరితమైన అంధకార హృదయాలలో ఆశాపూరితమైన అమృతకిరణాలను వెలయించిన సిద్ధార్థుడు! (రాజదంపతులిరువురు ఆనందసాగరములో తన్మయులై పోవుదురు.)

(అవనిక జారును)

---

# నా యాశ

ఎయిడెడ్ ఉపాధ్యాయులారా! శ్రీవిద్యాధికులారా!

నేను 1940 సం|| లో 4 గు రుపాధ్యాయులచే 1939 సం|| రంలో శ్రీ డైరక్టరు దొరవారిరూల్సు కొంతవరకు అమలుజరిపించితిని. దానికే శ్రీవిద్యాధికారులు సంతోషించి 10 %grant ఎక్కువ Reviewలో యిచ్చినారు. ఎడ్యుకేషనల్ కౌన్సిల్లు పోయినతరువాత ఇంక్రిమెంటుపొందుట నాకు యిదియే మొదటిసారి. దానికే నాకు సంతోషము కలిగి యింకానాయాశ ద్విగుణమైనూ్కలు వృద్ధిపరచి రూల్సుజరిపించిన యెడల 1941 సం|| లో నైనా 50% యింక్రిమెంటు పొందవచ్చునని ఆశ కలిగింది. దానితో నేను 1940 లో కంటె 41 లో ఎక్కువకృషి సలిపి అన్నివిధముల వృద్ధిచేశాను. శ్రీ డిపార్టుమెంటువారు యింక్రిమెంటు యిస్తారని ఆశతోయున్నాను. కాని క్వార్టరు గ్రాంట్లు వందస్కూలు పూర్తిగాయిస్తున్నారు. బాగానేయుంది. 42 సం|| రం ప్రారంభమయింది జనవరి ఫిబ్రవరి నెలలు, ఎలాగుగడచినవో నాకే తెలియదు. నేను నా ఉపాధ్యాయులు final grant కు యెదురు చూస్తున్నాము. ఈ సంవత్సరంకూడ గ్రాంట్లు బాగా యిస్తాం, బాగాపనిచేయండి, అని శ్రీవారు చెపుతూ వుండేవారు. దానితో నా ఆశకు అంతులేకుండా పోయింది. నిజంగా ఇదిమీరు ఆలోచించండి? అవునో కాదో? సరే ఆ సంబ్రమంకూడ అయింది. పోష్టుప్యూన్ రావటం, కవరు చేతిలోపెట్టటం, నాకు ఆనందం కలగటం, నేను ఒళ్ళుతెలియని ఆవేశంతో దానినిచించడం, ఒక్కమారేకలిగింది. నా రెండుకళ్ళు ఒక్కసారుగా బిల్లును దర్శించాయి. ఎంత? 80 రూపాయలు ఎంతమంది టీచర్లు? 5 గురు అప్పుడు నామనోవేదన మీరే ఆలోచించండి? ఈ పంతులు వృత్తికి అమాంతంగా తిలోదకాలు యిద్దామనుకున్నాను. ఈ వృత్తికన్నా చాకలి మంగళ్ళ వృత్తులు మేలనుకున్నాను కారణం? కష్టపడ్డా కూడున్నదా వృత్తిలో ఏలాగో మనసు కుదుట చేసుకొని మరునాడు శ్రీ వారిని దర్శించా సరే వారు ఏదో సమాధానము చెప్పి నాకళ్ళనీళ్ళు తుడిచారు బాగాకష్టపడి పనిచెయ్యమన్నారు. ముందు నాటికి తప్పకుండా యింక్రిమెంటు యిస్తామన్నారు. కధికారులు తప్పవెన్న దానికి ఏదే ఒకలోటు దొరకకపోదు పాపం! వారుమాత్ర మేమిస్తారు?

దానితో నేనుకూడ ఆలోచించి యీమాత్రమునకె పిరికితనం చూపించడంమంచిది కాదని తిరిగి ధైర్యమవలంబించినాను. 40,41 తో కంటె యింకను 42 లో ఎక్కువృద్ధిచేసిన యింక్రిమెంటు పొందక పోతానా యని ఆశతో 6 గురు ఉపాధ్యాయ హెడ్మాష్టరు సెకండరీగ్రేడు కొత్తపద్ధతి ట్రైన్డు అయ్యినటీచర్లు నేను ఒక్కనిముషముకూడా స్కూలుపైను పాడు చేయకుండా 24 గంటలు స్కూలుపనిలో మామనోశక్తులు ఉపయోగించి గార్డెన్, ఆటలు, పాటలు, చేతిపనులు, మొదలైనవి అద్వితీయముగా నెర

వేర్పుచు చదువునందున్ను, aids నందున్ను, వృద్ధి చేసి, స్టాగ్నేషన్ లేకుండాను ప్రమోషన్ యందు 50% న్నూ పిల్లలజనాభారీత్యా 60 % బాలురను స్కూలునందు హాజరుపెట్టి, వేస్టేజిలేకుండాచూచి చ్చేనవారిసంఖ్య ఎక్కువచేసుకుంటూ, యీ మొదలగాగల డిపార్టుమెంటువారి చట్టములు Rules తూచా తప్పకుండా పని చేశాము.

మేము యీలాగు రెండవ వ్యాపకము లేకుండా తదేకధ్యానముతో స్కూలుపనియందు నిమగ్నులమైయుండ కాలక్రమమున మార్చి సమీపించింది. ఇదిగో అదుగో అంటూ రోజులు గడుస్తున్నవి. 20వ తారీఖు వచ్చింది పోష్టుఫ్యూన్ రిజిష్టరుకవరు చేతిలో ఉంచాడు సరే అప్పుడు నా సంతోషము వెనుకటి మార్చిలోవలెనె వెల్లువిరిసింది కవరు చించాను ఏముంది దానిలో రు 110 లు 6 గురు మాష్టర్లకు యింక నాపరిస్థితిమీతో ఏమిచునవిచెయ్యాను? ఏమి వ్రాయవలెనో అప్పటి నామనస్సుకుగూర్చి నాకే బోధపడుటలేదు. ఎందుకువ్రాయటం? ఆలోచించుకోండి. యీలాంటి పరిస్థితిమీకు సంభవించినపుడు ఏమికలుగుతుందో మనస్సును అడగండి బోధపడుతుంది. ఆలోచించారు ఎందుకు ఈలాగువచ్చిందా అని పైఅధికారులు రిమార్కుబుక్కులో ఒక్కలోటూ వ్రాయలేదు. వెంటనే శ్రీవారిదర్శనం చేస్తూ బిల్లు కాగితం వారిముందుంచి ఇది బోధపడటంలేదని మనవిచేసుకున్నాను, దానితో వారు మాత్రం ఏమిచెపుతారు? వారుకూడ ఆశ్చర్యచకితులైనారు, ఈ చిదంబరరహస్యం వారికీ తెలియదని శలవిచ్చారు రూల్సు అమలుజరిపించి పనిచేయించటం వారివిధిగాని, గ్రాంట్లు ఎల్లావస్తుందో పాపం వారికేమి తెలుసు మొత్తంమీద నా కర్మ అనుకొన్నాను కానియింతటితో నాఆశ అడియాశ అయింది.

అసలు 50 % యింక్రిమెంటు పొందినవారెవరైనా ఉన్నారా? అని నాసందేహము ఎవరైనా ఉంటే పాఠకమహాశయులు తెలుపప్రార్థన అటువంటి వారున్నయెడల విని ఆనందించుదామని నాయాశ.

ఉపకారములలో అమలు జరగకపోయినా అపకారములలో రూలు బాగా అమలు జరుగుతోంది అని నాయూహ.

మరచిపోయా మరియొకవిషయం

ఈమధ్య యుద్ధభత్యమంటూటీచరుకు రూ 2 లు యిచ్చారు. దానితో మావారి ఆనందమునకు అంతులేదు. అసలులో కోరారుకోత ఈ తక్కువ వేతనములలో మేనేజరు కట్టు 15% Private conditions, centre class, చందాలు, యూనియన్ చందాలు శ్రీవారి దర్శనమునకు అగు రాకపోకల ఖర్చులు, మొదలైనవి చాలా ఉంటవిగా అవి అన్నీపోగా ఉపాధ్యాయునికేమి గిట్టునో మీకే తెలుసు. వారి జీవితములు ఎట్లుగడుప గలుగుదురో మీకేవిదితము.

ఈ జీవితమునకు ముక్తి ఎప్పటికైనా లభించునా నా ఆశ ఈడేరునా అని మన కడగండ్లు పోగొట్టుపోవాలి అంటే మనమంతా ఐకమత్యంగా యుండాలి యూనియన్లు సాగించాలి వాటిద్వారా ఆందోళనలు సాగించాలి. ఈనాడే యూనియన్లకు ప్రాణంపోయండి పోషించండి లాభాలు పొందండి ఇదే నా ఆశ ఇది ఫలించేవరకు వదలకండి.

శ్రీ డైరక్టరు దొరవారు నూతన పద్ధతులనేకములుపెట్టి అమలు జరిపించారు. దానిలో ప్రాథమికవిద్య చాలా అభివృద్ధి అయింది. వారు సంతోషించారు. ఎయిడెడ్ శాలలపైన సానుభూతి చూపించారు.

'గొర్రెకు బెత్తెడేతోక' ఎప్పటికి పెరగదు అట్లే ఉపాధ్యాయులు విచారించారు. శ్రీడైరక్టరు దొరవారు ఎయిడెడ్ పాఠశాలలోని ఉపాధ్యాయుల కడగండ్లు ఆలోచించాలి ఈ కరువురోజులకు అనుగుణ్యంగా అధ్యాపకశాలలకు స్కేలుగ్రాంట్లు మంచి స్కేళ్లకు యింక్రిమెంట్లు, యియ్యాలి. యుద్ధభత్యములు హెచ్చుచేయ గలందులకు ప్రార్థించుచున్నాను. ఉపాధ్యాయుల కరవు కొంత నివారణ కాగలదు. ఇదేనాయాశ.

ఇట్లు
చెరుకూరి శ్రీరామమూర్తి
శక్రటరీ
ఎయిడెడ్ టీచర్సు యూనియన్ భీమవరం
తాలూకా.

# బాలనీతి

(జనవరి నెల తరువాయి)

చిలకా వేంకట కృష్ణదాసు

తే. గీ. దర్శకముగాని విషయసందర్శక మయి సర్వసంశయచ్ఛేదియై సకలమునకు
చక్షువై యలరారును శాస్త్రమట్టి శాస్త్రహీనుండె యంధుండు జగతి బాల !
తే. గీ. భయము భోజనమును నిద్రపశువులకును మనుజులకును సామాన్యమై చనుచునుండు
గాని ధర్మము నరులలో గలదు మిగుల జగతి ధర్మబాహ్యుండె పశుసముడు బాల!
తే. గీ. ఆకలింగొన్న వానికి నన్న మిడుట పేదవానికిం బ్రేమతో బిచ్చ మిడుట
వంధ్యభూములలో పడు వర్షమటుల సత్ఫలం బొసంగునుగాదె సదయ బాల !
తే.గీ. ఆపదలయందు ధైర్యము నభ్యుదయమునందు క్షమ వాక్చతురత సభాంతరమున
గలిగి గాంధిమహాత్ముండు ఘనుడటంచు పేరుగాంచెగాన పూను మావిధులు బాల!
తే. గీ. తల్లిదండ్రులు మిత్రులు ధరణిపైన హితము గోరుచునుందురు ప్రేమతోడ
కార్యకారణములవల్ల గలుగునట్టి యితరమిత్రులు గోరరు హితము బాల !

---

# బాలనీతిశతకము

సప్తమ దశకము

గృహిణీ ధర్మములు

(గతసంచిక తరువాయి)

బాలకవి : వాకాటి పెంచలరెడ్డి

తే. గీ. భర్తతోడిదె లోకంబు వనితలకును । అట్టిభర్తల సౌఖ్యంబు హర్షమిచ్చు
కాన పతిసేవకన్నను ఘనము హెచ్చు । సుప్రసాద ! శ్రీ కాళీ వరప్రసాద. 1
తే. గీ. నవ్వు మొగమున నింటిలో నివ్వటిలుట । తనదు చేతలయందు శాంతంబుగనుట
మంచి మనమును గృహిణి ధర్మంబు దలంప । సుప్రసాద! శ్రీ కాళీ వరప్రసాద. 2
తే. గీ. మనసునందున మాటలంబనులయందు । భర్తకనుకూలగతినుండవలయు మఱియు
అత్తమామల భక్తితో నరయవలయు । సుప్రసాద ' శ్రీ కాళీ వరప్రసాద. 3
తే. గీ. నిర్మలంబగు మనసుతో నిర్మలంపు ! దేహసౌభాగ్య సరిమతోం దేజరిల్లు
గృహము నిర్మలము గనుంచ గృహిణి కగును । సుప్రసాద! శ్రీ కాళీవరప్రసాద. 4
తే. గీ. చాన విద్యాంసురాలు తాంగానియెడల । తనదుసంసారము సుబద్ధం గానుదగునె!
బాలురను విద్యలోం దేల్చు ప్రతిభగనునె ! సుప్రసాద ! శ్రీ కాళీ వరప్రసాద. 5

తే. గీ. ధవుని సేవయె నిరతంబుఁ దలచుచుండు । నట్టివారికి నెన్నఁడు హానిలేదు
కానఁ బతిని బూజించుటే కరము మేలు । సుప్రసాద శ్రీ కాళీ వరప్రసాద. 6
తే. గీ. దేవతలకేని మిన్నయై తేజరిల్లె । సూర్యునంతటి వానిని చోద్యముగను
లీల నిలిపెను నిచ్ఛసతీలలామ । సుప్రసాద శ్రీ కాళీ వరప్రసాద. 7
తే. గీ. భర్తఋణముసు నేసాధ్వి వసుధయందు । దీర్చి ఖ్యాతిని బ్రతిష్ఠించెఁ దిరముగాను
నట్టి చంద్రమతిన్ బోలఁ సర్వముగునె । సుప్రసాద ! శ్రీ కాళీ వరప్రసాద. 8
తే. గీ. భర్తకంటెను మును దినఁ బాడిగాదు । పతికి మున్నె పరుండుట పాపసరణి
మగనికిని లొంగకుండుట తగదు సతికి । సుప్రసాద ! శ్రీ కాళీ వరప్రసాద. 9
తే. గీ. అత్తవారింటిలో నాతి యణఁగి మణగి । యుండు టెంతేని క్షేమమై యొప్పుచుండు
నంతియేగాదు నిక్కంపు ఖ్యాతిగలుగు । సుప్రసాద ! శ్రీ కాళీ వరప్రసాద. 10

---

## మాల (పాట)

వి. గోపాలరావు & టి. సన్యాసిరాజు, విజయనగరం

1. మాలయనుచు నేలా ప - ల్కారు పల్కుచుందువు ?
మాలమీాలలేదు మన - మందర మొక్కటియె జాతి ॥మా॥
2. జాతిభేద మెంతువా ? - నీతిని పాటింపవా ?
జాతిలోన నేమికలదు - నీతిగా వర్తించుచుండ ॥మా॥
3. అన్నైన నీతిలేక - యున్న దరికిఁ జేరనీకు
ఎన్నడైన జాతిభేద - మెన్నరాదుసుమ్మి నీవు ॥మా॥
4. భరతమాత కన్నయట్టి - భారతీయులము కామా ?
భారతీయజాతి యనెడు - భావము ప్రకటింపుమా ॥మా॥
5. మాలయనగ మాలసుమా ! - మాల పూలమాలసుమా !
మాలతోడ నేగి భరత - మాతను పూజింపుమా ॥మా॥

---

## మగని చెవిలో.........

—చౌదరి.

### పరీక్షాధికారుల బాధ్యతలు.

ఏమండీ ! ఇదిగో, మిమ్మల్నే ! నిద్రపట్టిందా ! ఒక్కమాట. భారతదేశముయొక్క నిరక్షరాస్యత నిర్మూలనకై కంకణము కట్టుకున్నవారిలో మీా కొకరా ? జీతము పుచ్చుకుంటూనే అనుకోండి. జీతము పుచ్చుకునే వర్ణువంచని వాళ్ళకన్నా - జీవనోపాధికి జీతము పుచ్చుకొనైనా ఏతత్కార్యానికి పూనుకున్నందుకు సంతోషము.

ఐతే మనదేశము ఆంగ్లరాజ్యపరిపాలనక్రిందకు వచ్చి ఎంతకాలమైనది ? ఇంతకాలమునుండి నిరక్షరాస్యతకై పాటుపడుతూ యిప్పటికి ఈ స్థితికి

వచ్చారా ? మీలాంటి ఋజువర్తనులను అందచేసుకుని సదరు కార్యక్రమానికై ఈ వధ్యను పూనుకొన్నారా ? అందుకోసమై తమరు గావించుచున్న కృషి యెటువంటిది? యథార్థముగా ప్రాథమిక విద్యకు సంబంధించిన బరువు, భారము వహించు చున్నది. ప్రాథమికోపాధ్యాయుడు అంటే కాదన గలరా ? ప్రాథమికోపాధ్యాయుడు పూనుకున్న మహత్కార్యానికి! మీరు అప్పుడుగాని ఇప్పుడుగాని ఏవిధముగానైనా సాయపడుతున్నారా ?

కోరినన్ని పాఠశాలలు పెట్టి, పంతుళ్లకు జీతాలిచ్చి, విద్యాభివృద్ధికి వలసినన్ని, తగినన్ని, ఏర్పాట్లు ప్రభుత్వమే చేస్తుంటే ప్రత్యేకంగా నన్నేం చేయమంటావు ? అంటున్నారా ? మరి ఆశాఖకు సంబంధించిన అధికారులలో మీరొకరు గదా ! ఐనప్పుడు మీబాధ్యత యెంతవరకు ? పంతుళ్లు సరిగా పనిచేస్తున్నది లేనిది తనిఖీచేయడము అంటున్నారా ? ఐతే విద్యలోను, అనుభవములోను, సామర్థ్యములోనూ ఆ పల్లెటదిక్కు బడి పంతులుకన్నా యెన్నోరెట్లు యెక్కువైన మీరు పంతుళ్లు క్రమంగా వేళకువచ్చి పనిచేస్తున్నది లేనిది తనిఖీచేయడముతోటే బాధ్యత పూర్తిఅయిందంటున్నారుగదా ? మరి బడి తెరచి వుంచి వచ్చినవారికి రెండు ముక్కలు చెప్పినంత మాత్రాన ఉపాధ్యాయుని బాధ్యత నెరవేరిందంటే పూరకుంటారా ? ఊరుకోము. భావికాలంలో పౌరులు కాదగు గ్రామంలోని బాలబాలికలు ఎక్కువెక్కువగా బడికి వచ్చేటట్లు చేయాలి. సాధ్యమైనంతవరకు ప్రతి విద్యార్థి ఏ తరగతిలోను, ఒక్క సంవత్సరము కన్నా యెక్కువ కాలము ఉండకుండా చూడడమే కాక, ఒక్కొక్క తరగతి చదువును అర్ధసంవత్సరానికే పూర్తిచేసి సాధ్యమైనంత తక్కువ కాలములో ఎక్కువ చదువు విద్యార్థులకు వచ్చేటట్లు ఇతోధికంగా శ్రమించి పనిచేయాలి అంటున్నారా? మీరు మాత్రము వారివలె శ్రమించనక్కరలేదు. వారు క్రమంగా వేళకు వస్తున్నది లేనిది తనిఖీ చేస్తేనే మీబాధ్యత తీరింది అంటున్నారు

ఐతే భారతీయుల మొత్తము జనాభాలో అక్షరాస్యు లెంతమంది? వ్యవసాయకు లెంతమంది కేవలము కార్మికు లెంతమంది? వీరందరి సరాసరి ఆదాయమెంత ? ప్రపంచములో ఏ యొక్క దేశము కన్నా అక్షరాస్యతలోను, ఆదాయములోను, కూడ చాల తక్కువ అంటున్నారా? దానినిబట్టే జీవిత ప్రమాణము - ఆరోగ్యముకూడాను కదూ? మొత్తముజనాభాలో నూటికి 90 మంది గ్రామాల్లో నివసిస్తూ కూలిగాని, వ్యవసాయముగాని, చేస్తున్నారని అంగీకరిస్తున్నారు. అతి తక్కువ ఆదాయము మీద ఆధారపడి పల్లెలలో నివసిస్తున్న వీరు విద్యావిషయికంగా సంస్కారులు కారు ఈ జరుగుబాటు తక్కువతనములో గంజిలోని ఉప్పుకైనా వస్తుందని తమ బిడ్డలను కూలినాలికై పొలాలకు పంపుతూ ఉంటారు. వారందరినీ బడికివచ్చేటట్లు చేయడము ప్రాథమికోపాధ్యాయుడికి ఎంతవరకు సాధ్యము ?

కాస్తో, కూస్తో జరుగుబాటువున్న పిల్లవిషయమై అంతగా బాధవుండదు లోతక్కువవారిని తగినంత ప్రచారము ద్వారా ప్రాథమికోపాధ్యాయుడు బడికి వచ్చేటట్టు చెయ్యాలి అంటున్నారా ?

జరుగుబాటు అంటే వప్పుకుంటున్నాను. కాని తల్లిదండ్రులు విద్యావిషయికంగా సంస్కారులు కారు అంటే మీరూ కాదనరు. అటువంటి వారు ఏవిధమైన ప్రచారము ప్రబోధము లేకుండానే పల్లెటదిక్కు పంతులయ్య తెరచివుంచిన బడిలోనికి వారంతట వారుగా విద్యాభ్యాసానికివచ్చి కూర్చోవాలి అంటున్నారా? చిన్నమనివి లంబాడి (సుగాలీ స్త్రీ)లున్నారుగదా వారి దుస్తులు, ఆభరణాలు, ఆచార వ్యవహారాలు, ఎరుగుదురు. బజారుకైన బట్టలు యిస్తాము మీబట్టలు విసర్జించండి అంటే అంతమంది యిష్టపడతారా? చాల తక్కువలో తక్కువమంది అంటున్నారు? ఐతే మనము యిచ్చే బట్టలు [illegible]స్తుతము వారు ధరిస్తున్న బట్టలనాజూకు అందమనా? శుభ్రతకు మనవనా ? కాదు మీరు అంటున్నారు. జరుగుబాటువున్న పిల్లల్ని బడికి వచ్చేటట్టు చెయ్యాలన్నా తగినంత ప్రచారము ప్రబోధము, అవసరమనిపించుతా వుంది. ప్రస్తుత పాఠశాలలు జరుగుబాటుగల వాళ్ళకేనా అంటే అదీ కాదాయె. గ్రామంలోవున్న మాలమాదిగ, ఎరుకుల ఏనాది, ఆదిగాగల సవర్ణ అవర్ణభేదము లేకుండా ఆమాంబాపతులకు వారిబడియీడు పిల్లల జనాభాతీయమంటున్నారు. దానిని బట్టి ఇంతమంది బడియీడుపిల్లలు గ్రామంలో వుండగా బడికివస్తున్నది. ఇంతమందేనా అనే మొండి ప్రశ్నతో పంతుల్ని నిగ్గదీస్తున్నారు నిందిస్తున్నారు, శిక్షిస్తున్నారు. ఈ సంగతులు యథార్థమని వప్పుకుంటున్నారుగా అంటే ప్రజలలో సహా

ముగా కలిగిన మార్పువంనకే విద్యాభ్యాసకాంక్ష కలుగదనీ ఆర్థికపరిస్థితులు అనుకూలముగా వున్నవారికీకూడ తగినంత ప్రచారము, ప్రబోధము, అవసరమనీ, బీదబిక్కకి ఆర్థికముగా తగినంత ఎదురు సహాయము చేయుటకూడ అవసరమని అంగీకరిస్తున్నారు కదూ......నిద్రవేళ ఏమిటీగోల అని విసుక్కుంటున్నారా ? అయిపోవచ్చింది. చిన్నమనవి. ఈ ప్రయత్నాలేమీ చేయకుండా బడికివచ్చే విద్యార్థులు తక్కువగా వుంటారని అంగీకరిస్తున్నారుగా ఈ సందర్భములో భారతప్రజానీకపు నిరక్షరాస్యత నిర్మూలనకుగాను ప్రభుత్వము మీవంటివారిని ఆసరగా తీసికొని అందుకుగాను బద్ధకంకణులై ఉన్నదనే మీ ప్రచారము నేతిబీరకాయవంటిది అంటే గొప్ప ఆగ్రహకారణము కాదా !

పిల్లల సమీకరణకు ఉపాధ్యాయుడికి అంతగా తల్లిదండ్రుల సంఘాలు వున్నాయి అంటున్నారా ఈ రోజుల్లో బడిపంతులు మాటలను పాటించి బిడ్డలను బడికిపంపించే తల్లిదండ్రులు బహుస్వల్పము కనుక ఆ తల్లిదండ్రుల సంఘాలు ప్రభుత్వము తరఫున మీరు బాధ్యతపడాలి లేకుంటే ప్రభుత్వము ప్రాథమికవిద్యను నిర్బంధము చేస్తూ చట్టసమ్మతమైన కట్టుదిట్టాలైనా చేయాలి నిర్బంధములేక ప్రచారమూ లేక బడికి విద్యార్థులను ఆకర్షించి విద్యాభివృద్ధి కలిగించాలి అనడము "గాలిలో దీపము పెట్టి దేవుడా నీమహిమ" అన్నట్టుంది. ఈరోజుల్లో ప్రాథమికోపాధ్యాయుడు అంటే ఎంత భక్తి శ్రద్ధలు ఉన్నదియో అందరికీ తెలుసు. కనుక ప్రజలలో ప్రచారము గావించి విరివిగా బడికి విద్యార్థులు వచ్చేటట్టు చేసే బాధ్యత ఉపాధ్యాయుల నుండి ఉన్నత విద్యావంతులైన అధికారవర్గమువారు దాఖలుపర్చుకోవడము యెంతయు సబబు

పోనీ ఇతరులమాటటుంచి ఉన్నత విద్యావంతులైన మీరు ఇన్ని సంవత్సరాలుగావున్న మీసర్వీసులో, పిల్లలను బడికి పంపించే విషయంలో, ఏ గ్రామస్థులతోనైనా ఒక్కతడవైనా ప్రసంగించారా లేదు అంటున్నారా ? దేశము, దేశీయుల పరిస్థితులు, సభ్యదేశాల స్థితిగతులు, బాగా తెలిసిన ఉత్తమ విద్యావేత్తలైన మీరే మీబాధ్యతలను గుర్తించకుండా, సామాన్యులైన ఉపాధ్యాయుల పైతమువంటివారు తీసుకునే చర్యలు అధికారమును అందచేసుకునేగాని యుక్తాయుక్తము నెరిగి కాదంటున్నాను. ఎన్నడూ వినలేదూ "ఇతరుల కంటిలో ఉన్న నలుసునుగూర్చి ఆలోచించే ముందు తమ కంటిలోవున్న దూలమునుగూర్చి కాస్త ఆలోచించాలి" అను సామెత

ఇందు యెవరిబాధ్యతను యెవరు గమనించక పోయి నా మందలింపులు, సంజాయిషీలు, గ్రాంటు తగ్గింపులు, ట్రాన్సుఫర్లు, జరిమానాలు. మాత్రము తప్పవు బడి పంతులుకు, "అత్తచేసిన పనులకు ఆరళ్ళులేవు" అన్నట్టు మీకే బాధా లేదు. ఎవరి లోపమైనా శిక్షార్హుడు, పాపాలభైరవుడు, ప్రాథమికోపాధ్యాయుడు.....ఏమంటారు?.....నవ్వుకుంటున్నారా ?...... ......................

వారము రోజులనుండి క్యాంపులో వుండి అరకువచేసి అనారోగ్యముగా వున్నారు. పడుకోండి. ఈ అప్రియసంభాషణచేసినందుకు క్షమించండి.

---

# బకాసురవధ

రచయిత : కోటంరాజు సత్యనారాయణశర్మ

గీ. పూర్వకాలానఁ గల దొక్క పురవరంబు । ఏకచక్రపురం బని యెన్నఁబడుచు,
సకలశాస్త్రార్థములఁ జక్కఁ జదివినట్టి । అవనిసురు లందు వసియింప నలరుచుండె.

గీ. పరమసౌజన్యశీలురు పాండుసుతులు । విప్రవేషాల నావీట విప్రునింటఁ
గడపుచుండఁగ నొకనాడు కలిగె నొక్క । యార్తనాదమా గృహమందు నద్భుతముగ.

గీ. కరుణ తొలుకాడ రోదనకారణంబు । నరసి కుంతియు నోదార్చి యవనిసురుని
వాయునందను డగ్గఱి వారిజాక్షి । యిటులఁ దెల్పెను భూపనియొడుష్కులెల్ల.

గీ. "వీటి కావల గల డొక్కచేటుకాఁడు । ఉగ్రదనుజుఁడు బకుఁడని యుచ్చరింత్రు
దినము కొక్కని బండెడు" తిండితోడఁ । బంపునటుల నేర్పాటుల కావింపఁబడియె.
గీ. లేక లేకను గల్గిన యేకసుతుని । బంపఁగానయ్యె నీనాఁడు భక్ష్యముగను
పంపజాలక బాపఁడు బందుగులును । మిగుల చింతించి యీరీతి పొగులుచుండ్రి.
గీ. అనుచు వచియింపగా భీముఁడతి ముదమున । "నీదు నానతి నిచ్చిన నేను వోయి
కదనమునఁగూల్చి యసురుని కాలుకడకుఁ । బనిచి వచ్చెద దీవించి పంపు మమ్మ"
గీ. అంతలోపలఁ బ్రాహ్మణకాంత లపుడు । బండెడన్నము వండించి పదిలపరుపఁ
కడుపునిండుగఁ దిని కుంతికొడుకు పొంగి వందనమొనర్చి తల్లిదీవనల బొంది
బాహుకండూతి దీర్పంగ బయనమయ్యె.
గీ. అట బకాసురుఁ డెప్పటియట్లు కూడు । వేళకును రాని యాహారవేళ మించె
విప్రవరులకు నాయందు వెక్కసంబు । గలిగె, గాబోలు నా బాహు బలముచూపి
చించి చెండాడి వీరి వధించువాడ । ననుచు రోషాగ్ని గ్రాగుచు నరచుచుండె.
గీ. బండిదోలుచు నాయెడ పవనసుతుడు । బండెడన్నము భక్షించి బకుని గదియ
నిప్పుగ్రక్కుచు నసురుండు కుప్పళించి । పైకిదుముకంగ వారికి బవరమయ్యె.
గీ. కడుభయంకరమైనట్టి కదనమందు । క్రూరదనుజుని విప్రసంహారునింబట్టి
ఉరుగదాఘాతముల నొంచి యుర్విఁగూల్చె । చేతిగొడ్డంటఁగూల్చెడు చెట్టు పగిది.
గీ. పురము నంగల బ్రాహ్మణ ముఖ్యులెల్ల । వాయునందను వేనోళ్ళఁ బ్రస్తుతించి
నాటనుండియు కష్టాలనోటుపరచి । బహుసుఖాస్పదమైన జీవనముగనిరి.

---

# బోర్డువారి ధర్మములు

శత్రువు భారతదేశ గుమ్మము తట్టుచున్నాడని వుకారులు పుట్టుచున్నవి నమ్మరాదు. దేశము రక్షణవంతముగాను, బలముగలదిగాను, వుండవలెను. అట్లుండుటకు ప్రజల ఐచ్ఛిక సహకార మత్యవసరము బలవంతమున సహకారము పొందుట దైవమునకు కూడ చేయజాలనిపని. ప్రజల స్వేచ్ఛాసహకారమునకు యథార్థ ప్రచురణము ముఖ్యము. ప్రచురణను గ్రహించుటకు జ్ఞానము లేక విద్య ముఖ్యము. విద్యకు పునాది ప్రాథమికోపాధ్యాయుడు. దీని సూక్ష్మవిచారరూపమే శ్రీస్టాదమ్ దొరవారు (డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్) వారి విద్యావ్యాపన పద్ధతులు., నీ రాజధానియందు చరణముంచిన దాది ప్రాథమికవిద్య దినదిన ప్రవర్ధమానమైనదనుటకు విద్యాశాఖవారి రికార్డులే ఆధారము.

"విద్యలేనివాడు వింతపశువు" అని పూర్వవాక్కు. విద్యాజ్ఞానియే యథార్థమును గ్రహించగలడు. అప్పుడే ప్రజల సహకారము లభించగలదు. ప్రజల సహకారమే దేశరక్షణ. వివిధశాఖలు దేశరక్షణ నిర్మాణమున కాధారము సివిలు వుద్యో

గులు. సివిలు ఉద్యోగుల న్యాయబుద్ధియే ప్రజలయందుండి సహకారము సంపాదించు నది. ఇట్లు ప్రజలకును, సివిలు ఉద్యోగులకును, రక్షణశాఖలకును, తైలధారవంటి అవినాభావసంబంధము గలిగియున్నది.

రక్షణశాఖవారి సుఖమే దేశసౌభాగ్యము. అందుననే వారి సప్లయిల యందు నిమగ్నమైయుండుకతనను, మరియు కష్టనష్టముల కోర్చుటవలననూ, మూర్ఖ ప్రజలు, సాహుకార్లయొక్క దురహంకారముననను, నీ రోజులలో ధరలు పెచ్చుపెరిగి పోయినవి. పెరుగుచున్నవి. ఓరిమి గొప్పదికదా! దీనిని గ్రహించి తొందర కూడ దనియు, ప్రజలను నిర్బంధింపరాదనియు, శ్రీ గవర్నమెంటువారు ఇచ్ఛగించి ధరల విషయములలో తగు జాగ్రతలను తీసుకొనుచూ దేశరక్షణశాఖల కాధారభూతులును, ఉత్పత్తిదారులును, అగు సివిలు వుద్యోగులకు యీ ధరల హెంపుదలలో సామాన్య జీతముల జీవితనిర్వహణమును నెఱపజాలవని ఎలవెన్సుల రూపమున తాత్కాలిక వేతనాభివృద్ధిని చూపుచున్నారు. అందుకతన సివిలు ఉద్యోగులు పుష్టులై మనఃపూర్తి సేవను చేయగలుగుచున్నారు. తాత్కాలిక అధికవ్యయములను బడ్జెటునందు ఋణ రూపమున నిర్ధారణచేసి వాటిని తీర్చుటకు తాత్కాలికముగా అధికపన్నులు, ప్రత్యేక పన్నులు డిఫెన్సు సేవింగ్సు ఋణములు వగైరాల మూలమున హామి చూచుకొను చున్నారు. యిదంతయు ప్రపంచవిదితమే.

యిట్లు ప్రతిజీవియు అధికవ్యయముపాలగుచుండు నీ సమయములో ఉపా ధ్యాయుని స్థితిచూడుడు. సహకారమనేదానికి ఊహను కలిగించు అంకురార్పణదాత సహకారాంకుర ఖజానాదారు అయిన ఉపాధ్యాయుడు తిండిలేక మలమలమాడు చుండుట ఏటికార్యము. ఏటిన్యాయము. మానవుడెవ్వా డెవడైన సహించగల విష యమా ఉత్తమాట! ఉపాధ్యాయుడు పూర్ణదివ్యసేవకుడై యితరమందు జోక్యము లేక సహాయార్జనావిహీనుడై జీతమందు తరుగు పెరుగుటలేనివాడై సేవచేయుచున్నా డను సానుభూతితో వుపాధ్యాయుని కొరకు ధరలు తగ్గునా కలలోనిమాట! ధరలు తగ్గని కారణమున వుపాధ్యాయుని ఆకలి నశించునా! ప్రకృతి విరుద్ధము! ఆకట పొందు నుపాధ్యాయుడుచేయు సేవామాధుర్య మాభగవంతునికే ఎరుక! సేవయందలి లోపములకు మాత్రము దండననుదుటవ్రాసి పెట్టునదే' దీనికందరు పెద్దలే. ఉపక రించుటకుమాత్రమందరు తటస్తులే కారణముపాధ్యాయుల పాపమా? లేక.........

శ్రీ గవర్నమెంటువారు వారి మేనేజిమెంటులోని అన్ని డిపార్టుమెంట్లుల కష్టసుఖములు గ్రహించియు, మానవులందరికి ఒకే ఆకలిబాధ అని తెలిసియు పై నుదహరించిన విధముల నధికవ్యయమును అధికరాబడితో తాత్కాలికము గ భరించ వలసిన విధి యుపాధ్యాయుని యందున్న సమయములో ప్రయివేటు మేనేజిమెంట్లు బోర్డులలో వారి చర్యల నుపేక్షించి తటస్థముగా ఊరకుండుటలో వుపాధ్యాయుల తప్పేమి కాదా? శ్రీ గవర్నమెంటువారే బడ్జెట్ అప్పుతో నింపుచూ తాత్కా

లికమైన యీ కరువుదినముల క్రూరతనుపారద్రోలుచుండ నిర్దయగా, కాఠిన్యముగా, బోర్డువారు వుపాధ్యాయుల విషయములో ఫండ్సులేవని సాకుచెప్పి తప్పుకొనుటచూడ ..... వలె నున్నది. ఇట్లు సాకుచెప్పి ఉపాధ్యాయులను నిస్సహాయకులుగను, నిర్వీర్యులుగను చేసి సహకార జ్ఞానమును కలిగించు విద్యాజ్యోతికి వలయు తైలమును హారింపచేయుటకు మారుగ ప్రస్తుత అధికవిద్యాపన్నుల నాధారపర్చుకొనియు శ్రీ గవర్నమెంటు వారివలన ఋణముల నందియు, తాత్కాలికమైన ధరల పెరుగుదలను ఖండించుటకు స్కేల్సుతో కూడ సంబంధములేకుండ ద్విగుణీకృత వేతనాభివృద్ధిని జేసి ఉపాధ్యాయులకు తుష్టిని, పుష్టిని, కలిగించి తాత్కాలికపు నీ కరువుకాలమంతరించి సుభిక్షపు శాంతిదినములు గలగగానే పద్ధతిధర్మముగా రావలసిన ఇంక్రిమెంట్లనుండియు వేతనములనుండియు ధర్మబద్ధముగా ఋణములను తీర్మానింపు చేసికొనుటయు బోర్డు వారి ధర్మమని మనవిచేయుచున్నాను.

ఇట్లు,
ఆచార్య......సింహా
మాజీ కార్యదర్శి
విశాఖపట్నం రేంజి బోర్డు స్కూలుమాష్టర్ల యూనియన్.
బోర్డు ఎలిమెంటరీస్కూలు, సర్వల్లి

---

# భూగోళ ప్రశ్నోత్తరములు

## ఐదవ తరగతి

తాతా జగన్నాధరావు, హెడ్మాష్టర్, బోర్డు ఎలిమెంటరీస్కూలు, కొంత్యారు.
వేదుల అన్నయ్యశాస్త్రి, హెడ్మాష్టర్, బోర్డు ఎలిమెంటరీస్కూలు, గురమ్మపాలెం.



(1943 సం॥రం ఏప్రిల్ నెల తరువాయి)

Syllabus Heading—III (a) ప్రపంచ భూగోళము — 1 మంచు భూములు-(Lands of ice and snow (a) ఎస్కిమోలు, లాప్లాండు ప్రజలు, (b) కెనడాలోని మృగయులు, చేపలవాండ్రు.

37. మంచు తొడగు నేలయని దేనికి పేరు ?

జః ప్రపంచమున కత్యంత ఉత్తరముననున్న భూభాగములు సర్వదా మంచుచేకప్పబడియుండును. వీనిని మంచు తొడగు ప్రదేశములనియు టండ్రాలనియు అందురు.

38. రాత్రింబగళ్ళు యుండిన్నటి చిత్రమేమి ?

జః యీ ప్రాంతములయందు సంవత్సరములో కొంతకాలము సూర్యుని వెలుతురుండును. మరి కొంతకాలము ఒక్కటేరోజు పగలు, సూర్యుడు దక్షిణముగా దిక్చక్రము వద్ద రాత్రియు, పగలు కూడ కనిపించుచుండును.

39 టండ్రాభూములలో సంచరించు జంతువులేవి ?

జ: చేపలు, సీలు, వాలరస్, ధ్రువపు జింక, ధ్రువపు ఎలుగుబంటి, మొదలగునవి సంచరించును.

40 టండ్రా భూములలోని వారి ముఖ్యజీవన మేది ?

జ: వేటాడుట, చేపలుపట్టుటయు ఇచట జనుల ముఖ్యవృత్తి.

41. ఎస్కిమోలు, లాప్పులు, ఎచ్చట నివసించుచున్నారు ?

జ: ఎస్కిమోలు ఉత్తర అమెరికాలోని మంచు భూములలో నివసింతురు

లాప్పులు యూరపులోని లాప్లాండులో నివసింతురు.

42 అతిశీతలపు కెనడాలో నివసించువారెందువలన వేటకాండ్రైయున్నారు ?

జ: యీ ప్రదేశము మంచు తోడగు ప్రదేశమగుటచే వ్యవసాయమున కుపకరింపని కారణమున అచటి జనులు వేటకాండ్రైయున్నారు.

43. ఇచ్చటి జనులు వేటాడు మృగములెవ్వి ? వాటి తోళ్లు ఎట్లు ఉపయోగపడుచున్నవి ?

జ: శీతకాలమునందు తెల్ల ఎలుగుబంట్లు నక్కలు. బీవరు మార్టెను అను జంతువులు ఎక్కువ ఉన్నిని గల్గియుండుటచేత వేటకాండ్రు యీ శీతల అడవులకుబోయి వలలు, బోనులను, అమర్చి జంతువులను వేటాడుదురు యీ జంతువుల తోళ్లను హడ్సనుబే కంపెనీవారి వర్తకస్థానముల వద్ద యిచ్చి తమకు వలయు ఆహారపదార్థములు, పొగాకు, తుపాకులు, తుపాకిమందు, కంబళ్లు, రంగువస్త్రములు తీసుకొందురు

Syllabus Heading —(2) సమశీతలారణ్య ప్రదేశములు.

(a) కెనడాలో కలప వ్యాపారులు.

(b) నార్వే, స్వీడను.

44 కెనడాలోని టండ్రాభూములకు దక్షిణమున గొప్ప యడవులు పెరుగుటకు కారణమేమి ? అందలి ప్రధానమైన చెట్లేవి ? అవి ఏజాతిచెట్లను పోలియుండును ?

జ: యీ భాగము సమశీతోష్ణమండలములో నుండుటచేతను, వేసవిలో కురుచగానున్నను చెట్లు పెరుగుటకు తగినంత వేడిమి, వర్షపాతము కలిగియున్నందున యిచ్చట స్ప్రూస్, ఫర్, పైన్ అను ప్రధాన చెట్లు గల అడవులున్నవి ఆచెట్లు సరుగుడుజాతిచెట్లను పోలియుండును.

45 కెనడాలోని అడవులలో ముఖ్యపరిశ్రమ యేమి ? ఆపరిశ్రమకు కేంద్రస్థానమేది ?

జ: యీ అడవులలో కలప పరిశ్రమ ఎక్కువగా జరుగును. అడవులలో చెట్లు నరుకబడి, నదీ తీరములకు స్లెడ్జి బండ్లమూలమున చేర్చబడును. వరదలు రాగానే యీ దుంగలు కొట్టుకొనివచ్చును. వాటిని నదీముఖద్వారములవద్ద నాపి, యంత్రసహాయమున ముక్కలుగా కోయుదురు. కోతయందు మిగిలిన ముక్కలను కాగితపుగుజ్జు తయారుచేయుట కుపయోగింతురు యీ పరిశ్రమకు కెనడాలోని తూర్పుభాగమున ప్రవహించు సెంటులారెన్సునది పైయున్న క్విబెక్ అను పట్టణము కేంద్రస్థానము.

Syllabus Heading —(b) నార్వే, స్వీడను.

46. మంచుకురియు ప్రదేశములకును నార్వే, స్వీడనులకును, గలభేదమేమి?

జ: మంచుకురియు ప్రదేశములకంటె వెచ్చగానుండుటచే యిచ్చటనుంచి అడవులు పెరుగును. కలకలలాడు పూలమొక్కలతో రమ్యముగానుండును, ప్రజలుకొద్దిగా వ్యవసాయము చేయుదురు. పశువుల మేపుదురు. జున్ను, పాలు, తయారుచేయుదురు. శీతాకాలములో యీ అడవులలోనిచెట్లు ఆకులు రాలిపోవును

46. నార్వేస్వీడన్‌లోని పరిశ్రమలకు ఆయాదేశముల పరిస్థితులెట్లు తగియున్నవి ?

జ: నార్వేపర్వతమయమగు దేశమగుటవలనజనసంఖ్యతక్కువ.దీనిలోగ్లామెన్‌నదీమైదానమునందు యవలు, ఓట్లు పండింతురు పర్వతములపై పశువులనుగొఱ్ఱెలను పెంచుదురు. నార్వేదేశములోని త్రిభుజాకారపు చెట్లఅడవులను నరకి కాగితపుగుజ్జు, అగ్గిపెట్టెలు, కాగితము, తయారుచేయుదురు. నార్వేయొక్క తీరముమిక్కిలి చీలియుండుటచే యిచ్చట జనులునావికులు; చేపలుపట్టుటవీరి ముఖ్యవృత్తులలో నొకటి.

స్వీడన్‌లో మైదానప్రదేశ మెక్కువగానున్నందున పొలములలో రై, ఓట్లు, బంగాళాదుంపలు, బీటుదుంపలు, పండింతురు. పశువులనుమేపి వెన్న, జున్ను పైదేశములకెగుమతి చేయుదురు. కలప పరిశ్రమ యీదేశమునగలదు

Syllabus Heading—III (a) 3. గడ్డిబీడులు, సమశీతల మండలపు సముద్రములు(a) కెనడాలోని గోధుమపంట భూములు కెనడాదేశపు వ్యవసాయదారులు

47. ప్రెయిరీలని పేనికిపేరు? అచటగోధుమలు పండించుటకుగల వసతులేవి?

జ: కెనడా దక్షిణభాగమునందు ప్రెయిరీలను గడ్డిమైదానములు గలవు. ఇవి సమశీతోష్ణ మండలములోనున్నవి. ఇచ్చట గోధుమమొక్కలు చిన్నవిగానున్నపుడు వర్షముపడి మొక్కలను ఎదుగునట్లు చేయుటవలనను కంకులువేసినతరువాత ఎండ బాగుగాకాయుటవలనను, గింజకట్టి ఏరుట కవకాశముండుటవల్లను, యీ భూములలో గోధుమలు పండింతురు.

48. ప్రెయిరీలలో వ్యవసాయమెట్లు చేయుదురు?

జ: ఒక్కొక్కరైతు వందలాదిగ ఎకరముల భూమిని గలిగియుండుటవలన యంత్రసహాయమున నేల దున్నుట, కోతలుకోయుట, కుప్పలునూర్చుట, పంటలను ఎగుమతిచేయుట, మొదలగునవి జరుగుచున్నవి.

49. గోధుమలు విదేశములకే యేరేవులనుండి ఎగుమతి చేయబడుచున్నవి?

జ: వేంకువర్, మాంట్రియల్, అను ఓడరేవులద్వారా ప్రెయిరీలలో పండు గోధుమలు ఎగుమతి చేయబడును.

50 రాకీపర్వత తూర్పుప్రాంతమున పశువులేల పెంచబడుచున్నవి? ఆప్రదేశమునకే మని పేరు?

జ: రాకీపర్వతములకును, గోధుమలుపండు ప్రెయిరీలకును, మధ్యవర్షము తక్కువగా కురియు భూములుకలవు. ఇచ్చట ధాన్యాదులు పండవు. గడ్డిమాత్రము బాగుగాపెరుగును. అందువలన యిచ్చట పశువులను, గొర్రెలను, గుఱ్ఱములను, కోళ్లను పెంచెదరు. యీ జంతువులను పెంచుప్రదేశమునకు రాంచీ లని పేరు.

51. ప్రెయిరీ భూములలోనివారి వృత్తులేవి ?

జ: ప్రెయిరీలలో నుండు జనులవృత్తి సేద్యము మాత్రమేకాదు. వీరు పశువులమందలను, గొర్రెలను, పెంచి పాడిపరిశ్రమ బాగుగా చేయుదురు, జున్ను, వెన్న, మాంసము, తోళ్ళుపై కెగుమతి చేయుదురు. పందులనుకూడ పెంచి మాంసము విదేశముల కెగుమతి చేయుచున్నారు. (సశేషము)

---

# సంపాదకునకు జాబు

మహాశయా !

మీచే ప్రచురింపబడుచున్న "ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య" అను సంచికను పరిశీలించితిని. అందు 1939 సంవత్సరపు నూతన సెలబస్సు ననుసరించి హిస్టరి, సివిక్సు, నేచర్‌స్టడీ సబ్జక్టులకు ప్రశ్నోత్తరములు సరళభాషలో శ్రీ వేదుల అన్నయ్యశాస్త్రి (హెడ్మాస్టరు బోర్డుస్కూలు గురమ్మపాలెం) శ్రీ తాతా జగన్నాధరావు హెడ్మాస్టరు, సొంఠ్యాం గార్లచే రచియింపబడినవి. అయ్యవి ప్రాథమిక పాఠశాలోపాధ్యాయులకు విద్యార్థులకు, ఎంతయో ఉపయోగకరముగ నున్నవనుటలో సందియము లేశమాత్రమునులేదు. ఈ ప్రశ్నోత్తరములు పూర్తికాగానే సబ్జక్టువారిగా పుస్తకరూపమున తయారుచేయించి విద్యార్థులకు, ఉపాధ్యాయులకు అందుబాటులో నుండునట్టి ధరలకు ఏర్పాటు చేయించగలందులకు కోరుచున్నాను.

Vadlamani Somanatham,
Retired Asst., Govt. Training School, Parvatipuram.

# మనవి

## భూగోళ ప్రశ్నోత్తరముల పంపువారికి

అయ్యా,

మీరు పంపు ప్రశ్నోత్తరములచూచి కడుంగడు సంతసించితి, కాని నాకొక గొప్ప సందేహాము వచ్చినది. ఈ క్రింది ప్రశ్నకు జవాబులనేకులు అనేకవిధముగ చెప్పుచున్నారు.

ప్రశ్న:— ప్రపంచములో నన్నిటికంటె గొప్ప జలపాతమేది?

పై దానికి కొందరు "నయాగరాజలపాత" మని కొందరు "విక్టోరియా" అని మరికొందరు 'శివసముద్ర జలపాత' మని చెప్పుచున్నారు. మీలో ఎవరైనను ఏ జలపాతము సిద్ధారణచేసెదరో పత్రికాముఖమున తెలియజేయుటకై మనవి.

ఇట్లు
సుసర్ల విశ్వనాథం, టీచర్.

---

## ప్రాథమిక పాఠశాల గణితబోధిని

(సోదర ఉపాధ్యాయులకు సమర్పితము)

ఇది కేవలము ఎక్కములపుస్తకము కాదు. ఇందు I నుండి V తరగతుల పిల్లలకు అనుగుణ్యముగా కంఠస్థము చేయదగిన గణితసూత్రములు, పద్ధతులు వివిధమానములు చారిత్రక భూగోళాది విషయములు, క్రొత్తపద్ధతిని ఎక్కములు పొందుపఱుపబడినవి. విద్యార్థులకు ఉపాధ్యాయులకు అత్యంత ప్రయోజనకారి.

గ్లేజు కాగితము అందమైన మందమైన అట్ట వెల రు 0—4—0

విన్నపము:—పులిపాక రామకృష్ణమూర్తి, హెడ్మాష్టర్ అండ్ మేనేజర్.
శ్రీ. హిం. ప్రా. పాఠశాల, అమృతలూరు, (వయా) తెనాలి.

---

## THE EAST GODAVARI DISTRICT BOARD TEACHERS' UNION.

ది 11—4—43 తేదీ ఆదివారము చామర్లకోటలో యూనియను ప్రథమస్థాయీ సంఘసభ వైసుప్రెశిడెంటు శ్రీ కె వీరభద్రం హెచ్. సిరివాడ, పెద్దాపురం తాలూకా వారి ఆధిపత్యమున జరిగినది శ్రీ డైరక్టరు ఆఫ్ పబ్లికు యినస్ట్రక్షను వారియొద్దకు తత్క్షణావసరముల నివేదించుటకు రాయబారము వెడలుటకు, జిల్లాబోర్డువారి యొద్దకు మేనెల మొదటివారము దాటిన పిమ్మట రాయబారము వెడలుటకును, తీర్మానింపబడినది. తాలూకా యూనియన్లు అఫిలియేషను ఫీజు రు 3 లు, రాయబారము ఖర్చులకు రు 10 లును, యియ్యవలసినది గాను, రాయబారపు సభ్యులను ఎన్నుకొని వాంఛములను మెమోరాండమును తయారుచేయుటకును, తీర్మానింపబడినది.

జిల్లాసంఘము తరఫున జిల్లాబోర్డువారికి (మార్చినెల ప్రారంభవిద్య పత్రికలో 90 వ పేజీలో ముద్రింపబడిన) మెమోరాండమును 20—3—43 తేదీని జరిగిన బోర్డుమీటింగునకు హాజరయి సమర్పించినాము. పరిస్థితులు ఆశాజనకముగ లేకపోవుటచే జిల్లా యూనియనునుండి, తాలూకా యూనియన్లనుండియు, ఈ క్రింది మెమోరియల్సు పంపించినాము. అనుకూలమైన ఆర్డరు ఆశింపబడుచున్నవి. జిల్లా యూనియనునకు తాలూకా యూనియన్లు ప్రాణాధారములు. వీటి సహాయ సహకారములపైని జిల్లా సంఘౌన్నత్య మాధారపడినదిగాన చేదోడు వాదోడై సంఘకృషికి ప్రోత్సాహమిచ్చి ఔన్నత్యమునకై పాటుపడ ప్రార్థించుచున్నాము.

C V RAMA JOGA RAO,
SECRETARY,
The East Godavari District
Board Teachers' Union

---

To

**The Secretary Education and Public Health Departments,**
MADRAS.

Through
The Proper Channel.

The humble memorial of the
Most Respectfully showeth,

That the memorialists waited on deputation on 20 –3 –'43 before the East Godavari District Board Meeting, held in the East Godavari Board Office Cocanada, and submitted the enclosed Representation.

That after a careful consideration the Board has come to the conclusion to pay Dearness allowance to all the Teachers Provided the Government agrees to pay equivalant contribution if additional tax is levied by the Board

In this connection it is respectfully submitted that unless either the Government or the District Board or both come to the rescue of the humble memorialists there will be no salvation for the poor Elementary School Teachers, and in short the memorialists submit that the Teachers have to starve to death having no other resources to maintain themselves and their families in these hard days.

It is not out of place in this connection to submit that while all the Government servants drawing a salary of Rs 100/- and below including menials, Aided School Teachers and Teachers serving in municipalities having the benefit of the dearness allowance it would be really a hardship, misfortune for the Board Teachers if such benefit is not extended to them.

The memorialists appeal to the mercy of the Government.

We beg to remain,
Most Respectfully showeth,
The Govt., obedient Servants.

Copy submitted direct to save delay.

ది 18—4—43 వ తేదీ ఆదివారం మండపేట బోర్డుహయ్యర్ ఎలిమెంటరీ స్కూలు భవనములో శ్రీ వై. బ్రహ్మానందరావుగారి అధిపత్యమున తూర్పుగోదావరి జిల్లా ఉపాధ్యాయ యాజమాన్య సంఘ ప్రథమ స్థాయీసంఘ సభజరిగి యీదిగువ (యిందుతో) జతపరుపబడిన తీర్మానములు యేకగ్రీవముగా నామోదింపబడినవి.

రాజోలు, తుని, రామచంద్రపురం, కాకినాడ తాలూకాల ప్రతినిధులు సభకు హాజరైరి. అమలాపురం ప్రతినిధులు రాజాలమనిరి మిగిలిన వారివద్దనుండి యేవిధమగు సమాధానమును లేకపోయె.

సభకు భోజన, అల్పాహారపు యేర్పాట్లు, విద్యాభిమానలగు శ్రీ యేచూరి లక్ష్మీనారాయణ మూర్తి గారి సహాయ్యమున యేర్పరుపబడినవి.

ఆనాడే రామచంద్రపురం తాలూకా టీచరు మేనేజర్ల సంఘ ప్రథమ స్థాయీసంఘ సభ శ్రీ P. జనార్దనరావుగారి అధిపత్యమున జరిగినది అనేక ముఖ్యతీర్మానములు కావింపబడెను. తాలూకా సభ్యులకుకూడ పైవారి సహాయ్యమున భోజన అల్పాహారపు యేర్పాట్లు జరుపబడినవి.

Ch. K. S, SARMA.

---

# తూర్పుగోదావరిజిల్లా టీచరు మేనేజర్ల సంఘము, మండపేట

L. Dis. No. 5/43 D/ 21—4—43.

ది 18-4.43 సం॥రం తేదీని మండపేట బో. హ. ఎ. గరల్సు స్కూలులో శ్రీ. వై. బ్రహ్మానందరావుగారి నాధిపత్యమున జరిగిన ప్రథమస్థాయీ సంఘ తీర్మానములు అర్జెంటుకమిటీవారి సూచనలనుత్వరలో నమలుపరప ప్రభుత్వమువార్ని కోరుటకు తమ సంఘముల పనికొరకు, కిరసనాయిలు, తెల్లకాగితములు కోరుటకు శ్రీ జిల్లాకలెక్టరువారియొద్దకు రాయబారము పెదలుటకు, తా మేనేజర్ల సంఘములకు సలహాలిచ్చుటకు.

(3) అన్ని తాలూకాల గ్రాంటుబిల్లులు యింటిమేషను కాపీలు యీ సంఘమునకు పంపుటకు D. E. O. I. F. C. వార్లను కోరుటకు

(4) రేంజీ పరీక్షాధికార్లు స్కూళ్ళ పరిస్థితుల బాగుగా నెరిగి అర్హతను గమనించి సిఫార్సుచేసిన గ్రాంటు కూడ ర లేదు. నేటి గ్రాంటు స్కూళ్లకు బహు స్వల్పము. ఇట్టిక్లిష్టపరిస్థితులలో గూడ ప్రభుత్వ విద్యావిధానమును అక్షరాల అమలుపరచుచున్న యీ యైడెడ్ సంస్థకు వలసినంతయు, అర్హత గలిగి యున్నంతయు ధనము నీయక ప్రభుత్వము చిన్నచూపుచూచుట చాల విచారనీయము. ఇది పాఠశాలలను విరక్తిపొంది మూసికొనవలసిన పరిస్థితులు కల్పించినట్లగుచున్నది కావున వెంటనే 1942-43 సం॥ నకు రావలసిన గ్రాంటులో తగ్గిన మొత్తము నిచ్చుచూ, యిక ముందునండియు, యిట్టి లోపము రాకుండ వలసినంత ధనమిచ్చుటకు, ప్రభుత్వమువారిని కోరుచూ, 43-44 సం॥ బడ్జెట్టులో యీ సంస్థకు 5 లక్షలు ధనముగా నిచ్చినందుకు కృతజ్ఞతను వెలిబుచ్చుటకును.

(5) పిఠాపురం తాలూకా టీచరు మేనేజర్ల సంఘము త్వరలో స్థాపింపజేయుటకు అధికార్లను కోరటకోను.

(6) ప్రస్తుతము కంటింజెన్సీలకు కావలసిన వస్తువులవెలల పరిమితముగా పెరుగుచుండుటచేతను, అందుకై గ్రాంటులో ప్రత్యేకింపబడు 15% చాలకుండుటచేతను, స్కూలు రోలు సంఖ్యనుబట్టి తమకు న్యాయమనితోచిన Bonus అన్ని మేనేజిమెంట్లకు యిచ్చుటకు ప్రభుత్వమువారిని కోరుటకు.

(7) పెద్ద పట్టణములలో అద్దెగ్రాంట్లు నిప్పించ ప్రభుత్వమువారిని కోరుటకును,

(8) శ్రీ D. E. O గారి పెర్సనలు అసిస్టంటువారియొక్కయు, రేంజీ ఆఫీసుల అవసరపు గుమస్తాలయొక్కయు సహాయమున పెలవారీ గ్రాంటు లిప్పించ శ్రీ డైరెక్టరువారిని కోరుటకు,

(9) ఇప్పుడిచ్చుచున్న యుద్ధభత్యము ప్రభుత్వము సిబ్బందికిచ్చు రేట్లతో సమానముగా నిప్పింప ప్రభుత్వము వారిని కోరుటకును,

(10) శ్రీ డైరెక్టరు వారియొద్దకు రాయబారము వెడల శ్రీ y బ్రహ్మానందరావు, శ్రీ Ch K. S. శర్మగార్లకు అధికారమిచ్చుచూ, సదరు ఖర్చు భరించుటకును,

(11) నేటివరకు రూ 13 5-0 లు టీచర్లనిల్వతో గల సంఘ జమాఖర్చు ఆమోదించుటకును,

(12) శ్రీ రామా అండ్ కో వారు యిచ్చిన విరాళమునకు వారి నభినందించుటకును,

(13) శ్రీ వెంకట్రామా కంపెనీవారు మనకు చేయుచున్న అమూల్యసహాయమునకు 'విద్యోద్ధారక' శ్రీ ఈదర వేంకటారావు పంతులుగారికి కృతజ్ఞతను వెలిబుచ్చుటకును, యేకగ్రీవముగా తీర్మానించడమైనది

(Sd) Y. బ్రహ్మానందరావు,
ప్రెసిడెంటు.

కార్యదర్శి
Ch. K. S Sarma.

---

Proceedings of the 1st Standing committee meeting of The East Godavari Dt Teacher managers' Association, held on 18—4—43 in the Poard Higher Ele Girls' School, Mandapeta with Sri Y. Brahmananda Rao in chair

*　　　*　　　*　　　*

(12) శ్రీరామా అండ్ కంపెనీవారు యీ సంఘమునకు దయతో రూ 10 - విరాళమిచ్చినందులకు వారికి యీ సంఘము వారు తమకృతజ్ఞతను వెలిబుచ్చుచున్నారు.

(True copy)

Ch. K S. Sarma.　　　(Sd.) Y. Brahmananda Rao
Secretary.　　　President.

Communicated to Mrs. RAMA & Co., Ellore.

*　　　*　　　*　　　*

---

## తూర్పుగోదావరి జిల్లా ఎయిడెడ్ టీచర్సు యూనియన్, మండపేట

L. Dis. 134/43　　　D/ 20—4—43.

ది 18-4-43 ఆదివారం మండపేట బోర్డుహైయ్యరు ఎలిమెంటరీ గరల్సుస్కూలులో శ్రీ క. గోపాలంగారి అధిపత్యమున జరిగిన ప్రథమ స్థాయీసంఘసభా తీర్మానములు.

(1) ది 13-3-43 న జరిగిన మహాజనసభా తీర్మానములు త్వరలో సానుకూలపర్చ ప్రభుత్వము వారిని కోరుటకును.

(2) సార్జంటు కమిటీవారి సూచనలను త్వరలో అమలు జరుప ప్రభుత్వమువారిని కోరుటకును

(3) సర్వీసు రిజిష్టర్లలో "గ్రాంటుస్కేలులో 55%" అని ఉండుట "రూల్సు" నకు వ్యతిరేకము కనుక, "సంపాదించిన గ్రాంటులో 85% గా మార్పించుటకును, సదరు సర్వీసు కండిషనులు "తూచ" అమలుజరుగునట్లు చేయుటకు అధికారులను కోరుటకును.

(4) శ్రీ డైరెక్టరు వారియొద్దకు రాయబారము వెళల అధ్యక్ష, కార్యదర్శులకు అధికారమిచ్చుచు సదరుఖర్చు భరించుటకును.

(5) ఈ సంఘ చందా రెండుఅణాలు తాలూకా సంఘసభ్యులే వసూలుచేసి సదరు కార్యదర్శి ద్వారా యీ సంఘమునకు పంపవలయుటకును యేకగ్రీవముగా తీర్మానించడమైనది.

1943 సం॥ రం॥ గాను యీగిగువ ఆదాయవ్యయపట్టిక యంచనా వేయబడినది

| ఆదాయము | రు అ పై. | వ్యయము | రు. అ. పై. |
|---|---|---|---|
| 1 అఫిలియేషను రుసుము | 24—0—0 | పోస్టేజీ | 80—0—0 |
| 2 చందాలు | 100—0—0 | స్టేషనరీ అండ్ ప్రింటింగు | 40—0—0 |
| 3 విరాళములు | 176—0—0 | డిప్యుటేషను ఖర్చులు | 50—0—0 |
| | | ప్రోపగాండా ,, | 100—0—0 |
| | | ఇతర ,, | 30—0—0 |
| | 300—0—0 | | 300—0—0 |

4-12-42 తేదీని గుంటూరులోను 14-2-43 తేదీని రాజమండ్రీలోను శ్రీడైరక్టరు వార్ని కలసికొని ఎయిడెడు యుపాధ్యాయుల కష్టములపూర్తిగా నివేదించినాము. ఏతత్ఫలితముగ యుద్ధబత్తెముల క్రింద రు 2 లు నెలకు మంజూరు చేయబడినది. ఇది యధనము చేయుటకును, సర్వీసు కండిషన్లు చక్కచేయుటకును, నెలవారీ గ్రాంట్లనీయుటకును, స్కేళ్ళు హెచ్చించుటకు మొదలుగాగల యంశములగూర్చి యుపాధ్యాయుల యున్నతికై పాటుపడుచున్నాము గాన మీచందాలను సక్రమముగా చెల్లించుచు, విద్యాభిమానులనుండి విరాళముల నేకరించుచు, సంఘమున కర్థబలము చేకూర్చి, తాలూకా యూనియన్లను బలపర్చుచూ, తమ్మాలముగా మీకష్టసుఖముల నీ సంఘమునకు తెల్పి దీని ద్వారా ఫలితములపొందుచు తమ్మాలముగా సర్వతోముఖాభివృద్ధికై పాటుపడ యుపాధ్యాయులను ఉపాధ్యాయ యాజమాన్యులను కోరుచున్నాను.

తాలూకా యూనియను కార్యదర్శులు వీటిని తృ తా॥ సెంటర్లుకుపంపి ప్రచారమొనర్చి సంఘ శ్రేయాభిలాషులై పాటుపడకోరుచున్నాను

ఎ. నీలకంఠం,

కార్యదర్శి

---

ది 14-4-1943 సం మధ్యాహ్నము 3 గం. భీమవరం తాలూకా ఎయిడెడ్ ఎలిమెంటరీ టీచరు మానేజర్ల సంఘము కార్యవర్గ మొదటి సమావేశము శ్రీ తాడికొండ సుబ్బారావుగారి అధిపత్యమున భీమవరం శ్రీరఘురామా ఎయిడెడ్ హిందూ ఎలిమెంటరీ స్కూలులో సమావేశమై ఈక్రింది తీర్మానములను ఏకగ్రీవముగా ఆమోదించడమైనది

హాజరైన మెంబర్లు

1. తాడికొండ సుబ్బారావుగారు
2. నందుల జగన్నాధంగారు
3 వై. విశ్వనాధంగారు
4. సి హెచ్. శ్రీరామమూర్తిగారు
5. జె ఎగ్నేశ్వరుడుగారు
6. ఎ వి. చంద్రరావుగారు
7. సి. ఎచ్. కామయ్యగారు
8. క కాళికేశ్వరరావుగారు

1 ఈసంఘమునకు recognition యిప్పించవలసినదిగా శ్రీ డి యి. ఒ గారి ద్వారా శ్రీ డైరక్టరుగారిని కోరడమైనది

2 టౌనులోని పాఠశాలలకు టీచర్ల సంఖ్యనుబట్టి అద్దెలు యిప్పించుటకు ఈసంఘమువారు శ్రీ డైరక్టరువారిని కోరుచు తీర్మానించడమైనది.

3 ఈసంవత్సరమువచ్చిన గ్రాంట్లు చాల నిరుత్సాహముగా నుండుటచే టీచర్లకు మానేజర్లకుకూడ చాల నిరుత్సాహముగానున్నది. ఈయుద్ధపు రోజులలో యిట్లు, తక్కువ గ్రాంట్లు యిచ్చుటచే టీచర్లు మానేజర్లు చాల నిరుత్సాహపడుచున్నారు. గాన ఈ సంవత్సరము సప్లిమెంటరీ గ్రాంటు యిప్పించి

వచ్చిన లోపమును పూర్తిచేసి యికముందునుంచి యైనను మంచిపాఠశాలలకైనను అదనపు గ్రాంట్లు యిప్పించగలందులకు ఈసంఘమువారు శ్రీ డైరెక్టరు వారిని కోరుచున్నారు.

6. తాలూకా ఎడ్వైయిజరీ కమిటిలో టీచరు మానేజర్లకుకూడ రెండు స్థానములు యిప్పించగలందులకు ఈసంఘమువారు శ్రీ డైరెక్టరు వారిని కోరుచున్నారు.

నందుల జగన్నాధము
కార్యదర్శి
17-4-43

---

# భీమవరం

ఈ తాలూకాబోర్డు ప్రాథమికోపాధ్యాయ యూనియను యొక్క స్థాయీసంఘ సభ్యులు దివి 25-4-1943 వ తేదీని భీమవరంలో సమావేశమై ఈదిగువ వారిని అధ్యక్ష కార్యదర్శి, సంయుక్తకార్యదర్శులుగా యెన్నుకొనియుండిరి. (1) వేమూరి వెంకట్రామయ్య అధ్యక్షుడు (2) విష్ణుభొట్ల విశ్వనాధం కార్యదర్శి (3) మలపాక వెంకట్రామయ్య సంయుక్తకార్యదర్శి.

(1) ఉత్తర ఆఫ్రికా మొదలగు వివిధరంగంలలో మిత్రులుండలివారు పొందుచున్న విజయములకు సభవారు హర్షమువెలిబుచ్చుచు, వారిద్వారా అనతికాలములో ప్రపంచశాంతి చేకూర్చ భగవంతుని ప్రార్థించి

(2) హిందూస్థాన్ స్కౌటు మూవుమెంటువారి యాజమాన్యమున 12-5-43 మొ|| 19-5-43 వరకు జరుపబడు శిక్షణ తరగతులకు ప్రతిహాయ్యరు ఎలిమెంటరీ పాఠశాలనుండి ఒక ఉపాధ్యాయుని జిల్లాబోర్డు ఖర్చున పంపగోరడమైనది.

(3) పాఠశాల గ్రామమునుండి $1\frac{1}{2}$ మైళ్లు లోపున నివసించు ఉపాధ్యాయులకు వారివారి అజ్ఞలపై అట్లు నివసించుటకు పర్మిషను ఇప్పింపగోరడమైనది.

(4) 8 వ తరగతి పబ్లికు పరీక్షకు హాజరు అగు విద్యార్థు-యొక్క అనగా కృతార్థులు కాని వారితో సహా అందరిమార్కులు ఆయాపాఠశాలల ప్రధానోపాధ్యాయులకు తెలుపగోరుచు గవర్న్మెంటు పరీక్షల కమీషనరుగారిని కోరడమైనది.

వేమూరి వెంకట్రామయ్య
అధ్యక్షుడు

---

Secretary, Srı Ramachandrapur Taluq,
Board Teachers' Unıon.

ఈ తాలూకా యూనియను ప్రథమస్థాయీసంఘ సభాసమావేశము మండపేట బోర్డు హయ్యరు ఎలిమెంటరీ బాలికాపాఠశాలా భవనమున 18-4-43 తేదీ ఆదివారము శ్రీ పి. వెంకటరెడ్డి ప్రెశిడెంటు వారి ఆధిపత్యమున జరిగినది. స్థానికబోర్డు టీచర్సు భోజన అల్పాహారముల నేర్పాటు చేసిరి పాఠశాలలకు వలయుకాగితములకు, ఉపాధ్యాయుని ఒక్కొంటికి 4 శేర్లు కిరసనాయిలు యిప్పించ ఆయాయధికార్లను కోరుటకును, చందాల సక్రమముగా చెల్లించి సంఘమున కండయైనిల్చి ప్రోత్సహించ ఉపాధ్యాయుల కోరుచూ తీర్మానింపబడినది.

సి. వి. రామజోగారావు

---

శివపటం, దిగువపేట శ్రీ వేంకటస్వామి విద్యాలయంలో శ్రీ ళ వెంకోబరావుగారి అధ్యక్షత క్రింద 4-4-43 తేది ఆదివారం మధ్యాహ్నం 2 గం|| లకు శివపటంతాలూకా టీచరు మేనేజర్ల అండ్ మేనేజర్ల అసోసియేషన్ సమావేశమాయెను. 26. మందికి 19 మంది కార్యక్రమమున పాల్గొనిరి.

### తీర్మానములు

1. ఈసంఘము మంత్రిమండలివారికి సర్వ్వరవిజయమొందవుటకు భగవంతుని ప్రార్థించుచున్నది.

2. 1.10.42 నుండి నెలకు 2 రూ చొప్పున కఱవుబత్తెము ఇచ్చినందులకు శ్రీ గవర్నమెంటు వారికి శ్రీ డైరెక్టరు దొరవారికి యీ సంఘము హృదయపూర్వక కృతజ్ఞతనర్పించుచున్నది కాని ధరలు మితిమీరిన యీ కాలంలో ఇప్పుడు శాంక్షన్ కాబడిన అలవెన్సు మిక్కిలితక్కువ. చాలదు కాబట్టి సదరు అలవెన్సును నెలకు 2 రూ నుండి 5 లూ లకు హెచ్చింపవలెనని యీసంఘము గవర్నమెంటు వారిని, శ్రీ డైరెక్టరుదొరవారిని కోరుచున్నది.

3 ఈ సంవత్సరం టీచింగు గ్రాంట్లలో 22% చొప్పున ప్రొరాటకట్టు యునేపేర టీచింగు గ్రాంట్లలో తగ్గింపు చేసినందుకు యీసంఘమువారు మిక్కిలి అసంతృప్తి వెలిబుచ్చు సదరు తగ్గింపును తొలగించు ఉత్తర్వులు 20-5 43 లోగా పాలింపనిచో మేనేజరులశక్తులై పాఠశాలలు మూయవలసి వచ్చునని తెలుపుటకు చింతిల్లుచు తీర్మానించబడమైనది

(4) ప్రస్తుతపు మూడుమాసముల కొకతూరి గ్రాంటునిచ్చుపద్ధతి మార్చి ప్రతిమాసమునకిచ్చు పద్ధతి త్వరలో అమలుజరుప ప్రభుత్వమువారిని శ్రీ డైరక్టరువారిని కోరుచు తీర్మానము ఏకగ్రీవముగా ఆమోదింపబడినది.

(Sd.) C. VENKOBA RAO,
Chairman.
4—4—43.

---

### శ్రీవివేకానంద ప్రాథమిక విద్యాలయము, అల్లూరుపేట.

సప్తమ వార్షికోత్సవము. ఏప్రిల్ 18 సం 1943

ఈపాఠశాలయొక్క సప్తమవార్షికోత్సవము ఏప్రిల్ నెల 18 వ తేదీన శ్రీ ఆవంచెంచు సుబ్బారెడ్డిగారి అధ్యక్షతక్రింద జరుపబడెను. గుంటూరు ఆంధ్ర విశ్వ విద్యాలయపు లెక్చరరుగారైన శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్యా పంతులుగారు ప్రస్తుత విద్యా విధానమునుగూర్చి ఉపన్యసించిరి. కోపూయరేంజి ఇన్స్పెక్టరుగారైన యల్. వీరయ్యచౌదరిగారు ప్రాథమిక విద్యనుగూర్చి దాని అభివృద్ధి కొరకు ప్రభుత్వముచేయు కృషినిగూర్చి మాట్లాడిరి గ్రామస్థులనేకులు సభకువిచ్చేసిరి. పాఠశాల బాలబాలికలచే కృష్ణలీలనాటకమునుండి కొన్ని అంకములు ప్రదర్శించబడెను. కరతాళధ్వనులతోను, జాతీయ గీతములతోను సభముగించబడెను.

G. Gopalakrishnaiah,
Headmaster.

---

## మారుతీ ఎయిడెడ్, ఎలిమెంటరీ పాఠశాల

ప్రథమ వార్షికోత్సవము, పాతవూరు, అనంతపురం.

పై వార్షికోత్సవము, 1-5-43 వ, తేది శనివారము సాయంత్రం6 గం రావుబహదూర్ యం. లక్ష్మీనారాయణరావు ఎం. ఎ. ఎల్. టి. (రిటయర్డు జిల్లావిద్యాశాఖాధికారి) గారి అధిపత్యము క్రింద జయప్రదముగా జరుపబడెను పై వార్షికోత్సవమునకు అనంతపురము తాలూకా, సీనియర్ డిప్యూటీ ఇన్స్పెక్టర్ గారగు కె. శంకరన్ బి ఎ ఎల్. టి. గారుకూడా సభను మమ్ములను ప్రోత్సహించిరి. పైవార్షికోత్సవము పందెములలో జయమొందిన బాలబాలికలకు అగ్రాసనాధిపతిగారిచే, బహుమతు లొసంగబడినవి. ఆనాడుబాలికలచే భక్తకుచేల, అనునాటకము ప్రదర్శింపబడెన.

(Sd) బి. అంజనప్ప, మేనేజర్.




1941 వ సంవత్సరపు నూతన సిలబసు ననుసరించి

# ప్రాథమిక భూగోళములు

శ్రీ K. వెంకట్రావు B.A., L.T., గారిచే

2 - 3 - 4 - [illegible] తరగతులకు

వలయువారు — రామా అండ్ కో.,

ఏలూరు - గుంటూరు - రాజమండ్రి

సం|ర చందా రు 1-0-0 (పోస్టేజితో సహా) Reg-No M 3766

సంపుటము 32 సంచిక 3

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# Andhra Rastra Prarambha Vidya

(విద్యావిషయిక మాసపత్రిక)

జూన్ 1943

సంపాదకులు:

శ్రీయుత మహావాది వేంకటరత్నముగారు, బి.ఏ.,



వ్యవస్థాపకులు:

శ్రీయుత ఈదర వెంకయ్యాగారు,

ప్రచురయితలు:

రామా అండ్ కో.,

హెడ్ఆఫీసు :— ఏలూరు,

బ్రాంచెస్:— గుంటూరు , రాజమండ్రి.

Printed by Mr. Edara Venkaiah at his Pattabhirama Press, Ellore.

# విషయసూచిక